# అథ షోడశో%ధ్యాయః

# నరకోద్ధార వర్ణనము

సనత్కుమార ఉవాచ |

తేషాం మూర్ధ్వోపరిష్టాద్వై నరకాంస్తాన్ శృణుష్వ చ | మత్తో మునివరశ్రేష్ఠ పచ్యంతే యత్ర పాపినః || 1

రౌరవశ్శూకరో రోధస్తాలో వివసనస్తథా | మహాజ్వాలస్తప్తకుంభో లవణో%పి విలోహితః || 2

వైతరణీ పూయవహా కృమిణః కృమిభోజనః | అసిపత్రవనం ఘోరం లాలాభక్షశ్చ దారుణః || 3

తథా పూయవహః పాపో వహ్నిజ్వాలో హ్యధశ్శిరాః | సందంశః కాలసూత్రశ్చ తమశ్చావీచిరోధనః || 4

శ్వభోజనో%థ రుష్టశ్చ మహారౌరవశాల్మలీ | ఇత్యాద్యా బహవస్తత్ర నరకా దుఃఖదాయకాః || 5

పచ్యంతే తేషు పురుషాః పాపకర్మరతాస్తు యే | క్రమాద్వక్ష్యే తు తాన్ వ్యాస సావధానతయా శృణు || 6

కూటసాక్ష్యం తు యో వక్తి వినా విప్రాన్ సురాంశ్చ గాః | సదా%నృతం వదేద్యస్తు స నరో యాతి రౌరవమ్ || 7

భ్రూణహా స్వర్ణహర్తా చ గోరోధీ విశ్వఘాతకః | సురాపో బ్రహ్మహంతా చ పరద్రవ్యాపహారకః || 8

యస్తత్సంగీ స వై యాతి మృతో వ్యాస గురోర్వధాత్ | తప్త కుంభే స్వసుర్మాతుర్గోశ్చైవ దుహితుస్తథా || 9

సాధ్వ్యా విక్రయకృచ్చాథ వార్ధకీ కేశవిక్రయీ | తప్తలోహేషు పచ్యంతే యశ్చ భక్తం పరిత్యజేత్ || 10

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

ఆ అధోలోకములకు పైన నరకములు గలవు. వాటిలో పాపులు పీడలకు గురి చేయబడుదురు. ఓ గొప్ప మహర్షీ! ఆ వివరములను చెప్పెదను. వినుము (1). రౌరవము, శూకరము, రోధము, తాలము, వివసనము, మహాజ్వాలము, తప్తకుంభము, లవణము, విలోహితము అనునవి వాటి పేర్లు (2). వైతరణి అను నదియందు మురికి ప్రవహించుచుండును. కృమిణము, కృమిభోజనము, ఘోరమగు అసిపత్రవనము, దారుణమగు లాలాభక్షము, పూయవహము, పాపము, వహ్నిజ్వాల, అధశ్శిరస్సు, సందంశము, కాలసూత్రము, తమస్సు, అవీచిరోధనము (3, 4), శ్వభోజనము, రుష్టము, మహారౌరవము, శాల్మలి మొదలైన అనేకరకములు గలవు. అవి ప్రాణులకు దుఃఖమును కలుగజేయును (5). పాపకర్మలయందు అభిరుచిగల జనులు వాటియందు పీడలకు గురి చేయబడుదురు. ఓ వ్యాసా! వాటిని క్రమముగా చెప్పెదను. నీవు సావధానముగా వినుము (6). బ్రాహ్మణులు, దేవతలు మరియు గోవులు అను వాటి కొరకు తప్ప మిగిలిన సందర్భములలో తప్పుడు సాక్ష్యమును చెప్పువాడు, మరియు సర్వదా అసత్యమును పలుకువాడు రౌరవనరకమును పొందెదరు (7). ఓ వ్యాసా! గర్భస్థశిశువును చంపువాడు, బంగారమును అపహరించిన వాడు, గోవులను అపహరించినవాడు, నమ్మకద్రోహి, సురాపానమును చేయువాడు, బ్రహ్మహత్యను చేసినవాడు, పరధనమును అపహరించువాడు మరియు వీరితో స్నేహమును చేయువాడు, గురువును చెల్లెలిని తల్లిని గోవును కూతురును సంహరించిన వాడు మరణించిన తరువాత తప్తకుంభము అనే నరకమును పొందెదరు (8, 9). పతివ్రతను అమ్ముమవాడు, అధర్మముగా అధికవడ్డీలను వసూలు చేయువాడు, కేశములను అమ్ముమవాడు మరియు భక్తుని పరిత్యజించిన వాడు తప్తలోహము అనే నరకములలో ఉడికించ బడుదురు (10).

అవమంతా గురుణాం యః పశ్చాద్భోక్తా నరాధమః | దేవదూషయితా చైవ దేవవిక్రయికశ్చ యః || 11

అగమ్యాగామీ యశ్చాంతే యాతి సప్తబలం ద్విజ | చౌరో గోఘ్నో హి పతితో మర్యాదాదూషకస్తథా || 12

దేవద్విజపితృద్వేష్టా రత్నదూషయితా చ యః | స యాతి
కృమిభక్షం వై కృమీనత్తి దురిష్టికృత్ || 13

పితృదేవసురాన్ యస్తు పర్యశ్నాతి నరాధమః | లాలాభక్షం స
యాత్యజ్ఞో యశ్శస్త్రకూటకృన్నరః || 14

యశ్చాంత్యజేన సంసేవ్యో హ్యసద్గ్రాహీ తు యో ద్విజః |
అయాజ్యయాజకశ్చైవ తథైవాభక్ష్యభక్షకః || 15

రుధిరౌఘే పతంత్యేతే సోమవిక్రయిణశ్చ యే | మధుహా గ్రామహా
యాతి క్రూరాం వైతరణీం నదీమ్ ||16

నవ ౦వనమత్తాశ్చ మర్యాదాభేదినశ్చ యే | తే కృత్యం
యాంత్యశౌచాశ్చ కులకాజీవినశ్చయే || 17

అసిపత్రవనం యాతి వృక్షచ్ఛేదీ వృథైవ యః | క్షురభ్రకా
మృగవ్యాధా వహ్నిజ్వాలే పతంతి తే || 18

భ్రష్టాచారో హి యో విప్రః క్షత్రియో వైశ్య ఏవ వా | యాత్యంతే ద్విజ
తత్రైవ యశ్శ్వపాకేషు వహ్నిదః || 19

వ్రతస్య లోపకా యే చ స్వాశ్రమాద్విచ్యుతాశ్చ యే |
సందంశయాతనామధ్యే పతంతి భృశదారుణ || 20

ఓ బ్రాహ్మణా! గురువులను అవమానించువాడు, అతిథులను ఆదరించకుండగా పంపివేసి తరువాత భుజించు మానవాధముడు, దైవమును దూషించువాడు, దేవతావిగ్రహములను అమ్మువాడు, పొందకూడని స్త్రీ ని పొందువాడు మరణించిన తరువాత సప్తబలమనే నరకమును పొందెదరు. చోరుడు, గోహంతకుడు, పతితుడు, మర్యాదను ఉల్లంఘించువాడు, దైవమును బ్రాహ్మణులను మరియు తల్లిదండ్రులను ద్వేషించువాడు, రత్నములను పాడు చేయువాడు మరియు ఇతరులను హింసించుటకై యజ్ఞమును చేయువాడు కృమిభక్షమనే నరకమును పొంది అచట క్రిములను భక్షించును (11-13). ఎవడైతే తల్లిదండ్రులకంటే ముందుగా, ఈశ్వరునకు నైవేద్యము

చేయకుండగా, మరియు దేవతలకు ఆహుతలనీయకుండగా తానే భుజించుచుండునో అట్టి మానవాధముడు, మరియు శస్త్ర నిర్మాణములో మోసమును చేయువాడు లాలాభక్షమనే నరకమును పొందెదరు (14). దుష్టులచే సేవించబడే బ్రాహ్మణుడు, దుష్టప్రతిగ్రహమును చేయు బ్రాహ్మణుడు, అర్హత లేనివారిచే యజ్ఞమును చేయించువాడు, తినకూడని పదార్థములను తినువాడు, యజ్ఞములో వినియోగించబడే సోమలతను అమ్మువారు అనే పాపులు రుధిరౌఘము అనే నరకములో పడెదరు. తేనెటీగల తేనెను అపహరించువాడు, గ్రామమునకు అపకారము చేయువాడు భయంకరమగు వైతరణీనదిలో పడెదరు (15, 16) నూతన¸ంవనములో మదించి మర్యాదను ఉల్లంఘించువారు, ఆంతరశౌచము లేనివారు మరియు ఇతరులను మోసగించి జీవించువారు కృత్యమనే నరకమును పొందెదరు (17). వ్యర్థముగా చెట్టును నరుకువాడు అసిపత్రవనమనే నరకమును పొందును. వాడి బాణములతో మృగములు వేటాడి సంహరించు కిరాతులు వహ్నిజ్వాల అనే నరకములో పడెదరు (18). ఓ బ్రాహ్మణా! ఆచారభ్రష్టులైన బ్రాహ్మణక్షత్రియవైశ్యులు మరణించిన తరువాత అక్కడికే చేరెదరు. ఇళ్లకు నిప్పుపెట్టి వివిధప్రాణులు మంటలలో పడి మరణించుటకు కారణమైన వ్యక్తి శ్వభోజనము అనే నరకములో పడును (19). వ్రతలోపమును చేయువారు, తమ ఆశ్రమధర్మమునుండి జారిపోయినవారు మిక్కిలి దారుణమైన సందంశము అనే నరకముయొక్క యాతనల మధ్యలో పడెదరు (20).

వీర్యం స్వప్నేషు స్కందేయుర్యే నరా బ్రహ్మచారిణః | పుత్రా నాధ్యాపితా యైశ్చ తే పతంతి శ్వభోజనే || 21

ఏతే చాన్యే చ నరకాశ్శతశో%థ సహస్రశః | యేషు దుష్కృతకర్మాణః పచ్యంతే యాతనగాతాః || 22

తథైవ పాపాన్యేతాని తథాన్యాని సహస్రశః | భుజ్యంతే యాని పురుషైర్నరకాంతరగోచరైః || 23

వర్ణాశ్రమవిరుద్ధం చ కర్మ కుర్వంతి యే నరాః | కర్మణా మనసా వాచా నిరయే తు పతంతి తే || 24

అధశ్శిరోభిర్దృశ్యంతే నారకా దివి దైవతైః | దేవానధోముఖాన్ సర్వానధః పశ్యంతి నారకాః || 25

స్థావరాః కృమిపాకాశ్చ పక్షిణః పశవో మృగాః | ధార్మికాస్త్రి దశాస్తద్వన్మోక్షిణశ్చ యథాక్రమమ్ || 26

యావంతో జంతవస్స్వర్గే తావంతో నరకౌకసః | పాపకృద్యాతి నరకం ప్రాయశ్చిత్తపరాఙ్ముఖః || 27

గురూణి గురుభిశ్చైవ లఘూని లఘుభిస్తథా | ప్రాయశ్చిత్తాని కాలేయ మనుస్స్వాయంభువో%బ్రవీత్ || 28

యాని తేషామశేషాణాం కర్మాణ్యుక్తాని తేషు వై | ప్రాయశ్చిత్తమశేషేణ హరానుస్మరణం పరమ్ || 29

ప్రాయశ్చిత్తం తు యస్సై#్యవ పాపం పుంసః ప్రజాయతే | కృతే పాపే%నుతాపో%పి శివసంస్మరణం పరమ్ || 30

స్వప్నములో వీర్యస్ఖలనము చేయు బ్రహ్మచారులు, పుత్రులను చదివించని తండ్రులు శ్వభోజనమనే నరకములో పడెదరు (21). ఇవియే గాక అసంఖ్యాకములగు నరకములు గలవు. వాటియందు పాపాత్ములు యాతనలచే పీడించబడుదురు (22). ఇవియే గాక, ఇంకనూ అసంఖ్యాకములగు పాపకర్మలు గలవు. వాటిని చేసిన జీవులు నరకములలో యాతనలను అనుభవించుచుందురు (23). ఎవరైతే మనోవాక్కాయకర్మలను వర్ణాశ్రమధర్మమునకు విరుద్ధముగా ఆచరించెదరో, వారు నరకములో పడెదరు (24). స్వర్గములోని దేవతలకు నరకములోని ప్రాణులు తమకు క్రింది భాగములో తలపై నిలబడియున్నట్లు కానవచ్చెదరు. అటులనే, నరకములోని జీవులు తలలను వంచి క్రిందకు చూచుచున్న దేవతలను చూచెదరు (25). చెట్టుచేమలు, క్రిములు, కీటకములు, పక్షులు, పశువులు, పెద్దజంతువులు, ధార్మికులు, దేవతలు మరియు ముక్తులు అను క్రమములో పాపాత్ములగు జీవులు

ఉన్నతిని పొందవచ్చును (26). స్వర్గములో ఎంతమంది ప్రాణులు గలరో, అన్ని ప్రాణులు నరకములో కూడ గలరు. పాపమును చేసి ప్రాయశ్చిత్తమును చేయనిచ్ఛగించని మానవుడు నరకమును పొందును (27). ఓ కాలీపుత్రా! స్వాయంభువమనువు చిన్న పాపములకు చిన్న ప్రాయశ్చిత్తములను, పెద్ద పాపములకు పెద్ద ప్రాయశ్చిత్తములను చెప్పినాడు (28). ఆ చెప్పబడిన ప్రాయశ్చిత్తకర్మలన్నింటిలో శివుని స్మరించుట ఉత్తమమైనది (29). మానవుడు చేసిన పాపమునకు పశ్చాత్తాపము కూడప్రాయశ్చిత్తము అగును. అప్పుడు కూడ శివుని స్మరించుట శ్రేష్ఠము (30).

మహేశ్వరమవాప్నోతి మధ్యాహ్నాదిషు సంస్మరన్ | ప్రతార్నిశి చ సంధ్యాయాం క్షీణపాపో భ##వేన్నరః || 31

ముక్తి ప్రయాతి స్వర్గం వా సమస్తక్లేశసంక్షయమ్ | శివస్య స్మరణాదేవ తస్య శంభోరుమాపతేః || 32

పాపాంతరాయో విప్రేంద్ర జపహొమార్చనాది చ | భవత్యేవ న కుత్రాపి త్రైలోక్య మునిసత్తమ || 33

మహేశ్వరే మతిర్యస్య జపహొమార్చనాదిషు | యత్పుణ్యం తత్కృతం తేనదేవేంద్రత్వాదికం ఫలమ్ || 34

పుమాన్న నరకం యాతి యస్స్మరన్ భక్తితో మునే | అహర్నిశం శివం తస్మాత్స క్షీణాశేషపాతకః || 35

నరకస్వర్గసంజ్ఞాయై పాపపుణ్యే ద్విజోత్తమ | యయోస్త్వేకం తు దుఃఖాయాన్యత్సుఖాయోద్భవాయ చ || 36

తదేవ ప్రీతయే భూత్వా పునర్దుఃఖాయ జాయతే | జతత్స్వాద్దుఃఖాత్మకం నాస్తి న చ కించిత్సుఖాత్మకమ్ || 37

మనసః పరిణామో%యం సుఖదుఃఖోపలక్షణః | జ్ఞానమేవ పరం బ్రహ్మ జ్ఞానం తత్త్వాయం కల్పతే || 38

జ్ఞానాత్మకమిదం విశ్వం సకలం సచరాచరమ్ | పరవిజ్ఞానతః కించిద్విద్యతే న పరం మునే || 39

ఏవమేతన్మయాఖ్యాతం సర్వం నరకమండలమ్ | అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి సాంప్రతం మండలం భువః || 40

ఇతి శ్రీశివమహాపురాణ ఉమాసంహితాయాం నరకోద్ధారవర్ణనం నామ షోడశో%ధ్యాయః (16).

ఉదయము, రాత్రి మరియు మధ్యాహ్నము మొదలగు సమయములలో మహేశ్వరుని స్మరించు మానవుడు పాపవిముక్తుడై మహేశ్వరుని పొందును (31). మంగళస్వరూపుడు, పార్వతీపతి అగు శంభుని స్మరించుట వలన మానవుడు కష్టములన్నింటినుండి గట్టెక్కి స్వర్గమును గాని మోక్షమును గాని పొందును (32). ఓ బ్రాహ్మణ శ్రేష్ఠా! మహర్షీ! జపము, హోమము, పూజ మొదలైనవి పాపమును దరి చేరనీయవు. ముల్లోకములలో భూలోకములలో తప్ప మరియెచ్చటనూ వీటిని అనుష్ఠించుట సంభవము కాదు (33). ఎవడైతే మహేశ్వరునియందు మనస్సును నిలిపిజపము, హోమము, పూజ మొదలగువాటిని చేయునో, వాడు ఆ పుణ్యముచే దేవేంద్రస్థానము మొదలగు ఫలము పొందును (34). ఓ మునీ! ఏ మానవుడైతే భక్తితో రాత్రింబగళ్లు శివుని స్మరించునో, వాని పాపములన్నియు నశించును. కావున అట్టివాడు నరకమును పొందడు (35). ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! పాపమునకు నరకమనియు, పుణ్యమునకు స్వర్గమనియు పేరు. పాపము దుఃఖమును, పుణ్యము స్వర్గమును మరియు ఉత్తమజన్మను ఇచ్చును (36). ఏ వస్తువు అయిననూ ఆరంభములో ప్రీతిని కలిగించిననూ, మరల దుఃఖమునే ఇచ్చును. కావున, సర్వము దుఃఖాత్మకమే. కేవలసుఖమునిచ్చేది ఏదీ లేదు (37). సుఖదుఃఖములు కేవలము మనోవికారములు మాత్రమే. అవి బాహ్యపదార్థముల ధర్మములు కావు. పరంబ్రహ్మ జ్ఞానస్వరూపుడు. జ్ఞానము వలన సత్యతత్త్వము అవగాహనకు వచ్చును (38). ఓ మునీ! ఈ స్థావరజంగమాత్మకమగు జగత్తు అంతయు జ్ఞానస్వరూపమగు బ్రహ్మ కంటే భిన్నముగా

లేదు. పరబ్రహ్మజ్ఞానము కంటే గొప్పది మరియొకటి లేదు (39). నేను ఈ తీరున నరకమండలమును అంతను వర్ణించితిని. ఈ పైన ఇప్పుడు భూమండలమును గురించి చెప్పెదను (40).

శ్రీశివమహాపురాణములోని ఉమాసంహితయందు నరకోద్ధారవర్ణనము అనే పదునారవ అధ్యాయము ముగిసినది (16).